# వేమయోగీయము



నాదెళ్ల మేధాదక్షిణామూర్తి

# శ్రీ వేమయో [illegible] ము



★

కర్త,

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి

★

కృష్ణా స్వదేశీ ప్రెస్, బందరు.

**1955**



[రు **1-8-0**

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# కవియోగులు

మానవమనస్తత్త్వము విభిన్న వికాస విలసితము. తత్సంస్కారము దేశకాలపాత్రోచితమైయుండును. ఆయా సంకలనముం బట్టి లక్షకొక్కఁడు 'కవి' యును గోటికొక్కఁడు 'యోగి' యును గానౌను. తత్తదుభయసంవిత్సంయోజనము క్వాచిత్కముగా నొదవి తత్కర్త్రి శశ్వత్క వహాచుండును.

కొందఱదృష్టిని గవితాయోగితోభయసందర్భమే పొసంగ నేరదు. ఏలయన, 'దృష్టిరమ్యామో ర్మితరితాస్వాయ' మ్మన నెవ్వఁడు 'క్రాంతదర్శిత్వ' విలసితుఁడై ప్రకృత్యంతర్లీన సౌందర్యమయానంద రస తరంగడోలికలం దూఁగుచుండునో వాఁడే 'కవి'. ఇట్టి యైహికమెల్ల గర్హించి ప్రకృత్యతీత సచ్చిదానంద పరబ్రహ్మ సాక్షాత్కార మొదవించికోఁగల్గినవాఁడే 'యోగి'. కవి నిజదృష్టివైలక్షణ్యముచే నాకర్షితమైన దానియందలి రామణీయకత కక్షురత్వమును గల్పించి యొరుల మనఃఫలకముల కెక్కింపఁజాలును. యోగియన్ననో, మనోలయ మొదవించికొని కనుమూసినను దెఱచినను సర్వము బ్రహ్మమయముగాననన్యస్థితినంది 'యతోవాచోనివర్తంతే' యన్నట్లు మౌనమును వహించియుండును.

ఇట్టి పరస్పర విభిన్నత నెంచి 'కవియోగు' లననేచెల్లదా యన్న, 'నానృషిః కురుతేకావ్య' మ్మన్నయార్యోక్తియట్లుండఁ బ్రాచేతసవ్యాసప్రభృతుల నేమందము? మనకు వీరెట్లో పాశ్చాత్యులకు 'హోమర్' "వర్జిల్" ప్రభృతులు నిట్టివారేయాయె. వారెంతెంతటి మేటికవీంద్రులో యంతంత వేదాంతులు నైరయ్యె. అట్టి యెడఁ బూర్వోక్త వైరుధ్య సమన్వయముకొఱకు మన మిచ్చో లక్ష్యముగా 'వేమయోగిం' గూర్చి ప్రస్తావించి కొందము.

అతఁ డాంధ్రదేశమున నేమూగచింతపల్లిలోనో పదేడవ శతాబ్దియందు భాగ్యశ్రీమంతుఁడుగాఁ బుట్టిన పాకనాఁటిరెడ్డి వంశజుఁడు. గారాబముగాఁ బెరుఁగుటచే నాతని కబ్బినవిద్య యత్యల్పము. జవ్వనంబుతఱి నేకొండపేటి వేశ్యపొత్తుననో యుండఁగాఁ జిత్తము మాఱిపో, నొకయోగిసత్తము చేరికవల్ల నీరికలాఱ నద్వైతసంస్కారముం గవితాధారయుం బ్రాపించినవాఁ డాయెను. ఆపై నాతనినోట వచ్చినచాటూక్తులెల్లఁ బద్యములై శ్రోతలకు హృదయాకర్షకములు గాఁగా నానోట నానోటఁబడి యందెన్నెన్నియో లోకోక్తులై పోయినవి. అట్లు తనమదికిఁ బొడకట్టిన దేనినైన యథాతథముగా నొరులమనంబుల కెక్కింపఁజాలెను. అట్టివీతెలుఁగుగడ్డ యున్నంతవఱకు నిలిచిపోఁదగ్గవే.

రామశబ్దమైనరాని యావేమన్నభాష పామరులకైన నందుపాటు కాఁదగు తేటతెలుఁగు జాతీయముల కిక్కయౌట నందఱమనంబులకు సులువుగా నెక్కెను. ఆతని యుపమానము లశ్రుతపూర్వములై యందు నవ్యతతోఁపఁ దత్కవిత కవి జీవప్రాయములై ప్రకృత్యనుభవసిద్ధములుగా నుండును. అందెందును నెరవుసొమ్ములనఁదోఁచు శబ్దాలంకారములుగాని నిగూఢములనిపించు నర్థాలంకారాదికములుగాని పాదపూర్తులకౌ వ్యర్థపదములుగాని లేక, హాస్యనిలయమౌ భావనాసంపదమీఱఁ 'గొండంతయర్థము గోరంతలోనే యిమిడిపోఁగా, నల "కాప్లెలు''గా రన్న "మారిసన్సుపిల్" కంటె గాఢతరములైన యమృతఘుటికలుగా వెలసి యింపులుగులుకుచుంటచేఁ బలుమాఱు స్మరింపఁజేయుచుండును.

మఱియు నాతండు నన్నయాదులయట్టి లాక్షణికతగాని పెద్దనాదులకుదీటౌ ప్రబంధనిర్మాణదక్షతగాని లేనివాఁడైనను, "వాక్యం రసాత్మకం కావ్య" మ్మన్నదానికి లక్ష్యభూతములౌ చాటుపద్యములందు లోకసామాన్యాంశములకే నిజభావనాశక్తిచే జీవముఁ బోయఁజాలిన స్వాతంత్ర్యము రూపింప మనోహరత్వము దీపింపఁ జేయుటచే ఖండకావ్యోదయరూప నవ్యకవితాభ్యుదయము

నకు మార్గదర్శి యనిపించికోఁజాలెను. కాని 'రససిద్ధాః కవీశ్వరాః' యన్నయార్యోక్తి కిరవుగాఁదగ్గ యుద్రేకజనకమైన నిసర్గ సామ నస్యముమాత్ర మీతనియందు లుప్తమై లోకవిమర్శనోత్సేకమే మెండుకాఁగాఁ "గృశాను" దృష్టిగాఁ గాకయున్నను, నిర్దాక్షిణ్య ముగాఁ గృత్రిమవేషధారిత్వాదికముల నెంతయు గర్హించువాఁడై, తఱచు పరిహాసాత్మక ప్రసంగములకుం గడంగుచుండెను. అట్లని యౌచిత్యముందొలంగె ననియుం జెప్పనొప్పదుగాని 'మసురుసా' లనిపింపఁదగ్గ దురుసుతన మొక్కొక్కెడఁ గానుపింపకపోదు.

అగుచో నిది యోగిత్వలక్షణముమాత్ర మానాయన్న సిద్ధ స్థితియం దిది యప్రసిద్ధమే యయినను, సాధనావస్థలోఁ దనకబ్బిన వేదాంతమువల్ల స్వప్నదృష్టం బనఁదోఁచు నీయైహికంబునుండి నిజ మనంబును మరల్చికోఁజూచు పూనికయం దిట్లుపొసంగియుండు ననఁ జెల్లును. కాకున్న, విభిన్నవిషయ విమర్శనరూప వాక్ప్రచారమున కవకాశము గలుగనేరదు. ఇట్టు లాత్మబోధంబు కానుగాను మానం బూని 'యోగి' నా నొప్పెను.

ఇందులకు నిదర్శనముగా నిచ్చో "రంగదాసు" నిం జూచి యుంటిమి. ఈతఁ డాబాల్యము నస్మత్పితృపాదులకు శుశ్రూష గావించుచుండినవాఁడు. క్రమముగా నవధూత యౌదనుక నీతనియం దొదవుచుండిన పరివర్తనాదికమున కేన సాక్షినై తిని. గురుశిష్య సమా గమముతఱి నుభయులకుం దుదిదనుకఁ బద్యరూప ప్రసంగమే నడచు టలో, 'నాదెళ్లాన్వయ గురువర !' యని యాతఁడు వందన మందించు చుంటయుం బ్రత్యుత్తర మిడుచోఁ బద్యాంతములం దీగురువరులు 'రంగా!' 'చినవేమన్నా!' "అభినవ వేమా !" యనుచు సంబోధించు చుంటయును నేన వీనులార వినవిన, నట్టి యాశుకవితాప్రచారము నాకును నలవడుటయట్లుండ, నా వేమన్నయు నీతనియట్ల క్రమ ముగా జీవన్ముక్తుండు గానయ్యె నన్నది నామదికి రూఢమయ్యెను.

అంతట రాయవరపు పూర్ణయాఖ్యుండౌ నస్మత్పితృ చ్ఛాత్ర వర్యుం డొక్కం డేండ్లతరబడిగాఁ దిరిగి తిరిగి సేకరించిన శ్రీతాళ

పత్రికాదికములందలి కూ వేమన పద్యములఁ దానెత్తి యకారాదిగా వ్రాసి తెచ్చి వినిపించుచురాఁగా, నా కందుఁగలిగిన యుత్సాహము కొలఁది నేతాదృశముల నేను నల్లుచు వచ్చితిని. ఆపై, నాపదాఱవ యేఁట మా తండ్రిగారు 'వేమనసూక్తిరత్నాకర'పుఁబరిష్కరణం బొనర్చుచోఁ దత్సంగ్రహకర్త్రు విరచితమైన వచనరూప చరిత్రము నేను సవరింపఁబూనుట సంఘటించెను. దాన నాకిద్దానిని ప్రప క్షమమునఁ బ్రబంధరూపము నందింపఁ గుతూహల ముదయింపఁగా 1910 లోనే "శ్రీ వేమయోగీయ" మనుపేర వ్రాసియుంటిని. 1917 లో నద్దానిని ముద్రణమునకుఁ బంపఁగాఁ బరహస్తగతంబై పోయెను.

ఎట్లాయెనేమి, యిది నేఁటి కీరూపమున వెలువడుయోగము కలిగెను. ఇట్టిటలోఁ దొలుతటిచరిత్రాంశములం దేకొన్ని మార్పులో కావలసిన వైనను, ముందాతఁడు వేశ్యాలోలుఁడై పిదప నెట్లో తన మనసుమాఱఁగా సముచిత వేదాంతప్రబోధానంతరమున నాత్మ బోధంబా కవితాప్రచారమునకుం గడంగెనన్న ప్రధానవిషయ మట్లే యున్నది. ఇందలి పురవర్ణనాదికమెల్ల రాజవంశజుఁడుగా నెంచం బడినప్పటిదేయై ప్రాచీనఫక్కి ననుసరించినదై యుండ నద్దానినే యథా తథముగా నుంచినందున విప్రతిపత్తి లేదుగదా. మఱియు నాయిక సామాన్యయైనను నసామాన్య గుణగణవిశిష్టయౌ నౌచిత్యసంపాద కమే యాయె. ఇంక నాయూపాత్రముల సంజ్ఞ లేవయినఁ గథాగమన మున కంతరాయజనకములు గానేరవుగాన నందుం గూర్చిన చర్చ యనావశ్యకము. ఇంక నప్పటిశృంగారఘట్టము మాత్ర మిప్పుడు కొంతసంకుచితముగాను వేదాంతప్రబోధఘట్టమే యధికముగాను మార్చుట నిజవయోధర్మము మాత్రమేకాక "యోగీయ"మునకు సముచితముగదా? ఏమయినను 'సమలోష్టాశ్మ కాంచనత్వము నే సాధింపఁజాలినయయ్యోగిపుంగవుఁ డేవేవో బంగారమొనర్చినట్లుండిన లీలల వివరించిన భాగ ముడిగి యచ్చో నాతనిప్రశస్తికి మూలమైన బంగారమువంటి సూక్తిరత్నావళిం గూర్చి చేర్చుటయందలి యౌచి త్యము తద్‌జ్ఞులకే విశదము;

మఱియు నిందలి తృతీయాశ్వాసగత గురుప్రబోధము శ్రీశాంకరవరా "వివేకచూడామణి"కి సారభూతమై కొందఱు జిజ్ఞాసువుల బుద్ధులకే యందుపాటుగానో ననుకొనువా రిందలి చతుర్థాశ్వాసము నందలి పూర్వోక్త వేమనోక్తులు సుగమములౌట సర్వజనసమాదరణీయత నందఁదగియుండునని యెంచకపోరు. ఇంతకు నిద్దానమనము గమనింపఁదగిన దేమన, వేమనయందుఁ గవితా యోగితోభయ మార్గసంధి సంఘటించి వన్నె కెక్కఁజాలెనన్నదే. ఇట్లనన్యప్రచారముగల నిజవాక్కులవల్ల మన తెలుఁగున కొకనూతనమైన వెలుఁగును గూర్పఁజాలిన యీ 'కవియోగీంద్ర' చరిత్రము తత్సూక్తులతోఁబాటు సుస్థిరంబై వెలయ శ్రీగురువర్యుల కృపతోడ్పడనయ్యెడుఁగావుత.

బందరు,
5-7-1955

ఇట్లు విద్వద్విధేయుఁడు,
నాదెళ్ల మేధాదక్షిణామూర్తి.

---

## శ్రీ వేమయోగీయ విషయసూచిక.

### — అవతారిక —

## తృతీయాశ్వాసము



## చతుర్థాశ్వాసము

*కృతిపతితలో సహృదయులు కొందఱయయాచిత సాదరోక్తులు*

'ఉభయకవి మిత్ర' 'ప్రతిభాంబి' 'కవితాకళానిధి' ప్రభృతి బిరుదాంకిత

శ్రీ భువనగిరి విజయరామకవిగారు, గుంటూరు

శా. శ్రీ విద్వత్పురుషోత్తమార్య గురు పాత్రీభూతశిష్యత్వ పు
త్త్రా! వేదస్థిర నాదశాస్వయజ మేధావక్షిణామూర్తికా
త్త్రీ! వర్ధిల్లు చిరాయురున్నతుల, భక్తిశ్రద్ధలొప్పారు నీ
సేవన్ దండ్రినిదప్పువారలకుఁ దుష్టిన్ బుష్టి నిష్టాప్తియౌన్॥

చ. నిలిపితి తండ్రిచాలు పరినిష్ఠిత తన్నిఖిల ప్రవర్తనా
వళుల విశేషపుష్టులఁ బ్రవర్తిలఁ జేయఁగనోపస న్విరా
జిలి, యిపు డాత్మలబ్ధి పరిషేచనగాఁగఁ దదర్పణంబుగాఁ
గొలిపితి కీర్తికాయపితకు న్గడుధన్యుఁడవైతి సోదరా! 2

క. ప్రాణాహుతిగాఁ బితకు రవాణాఁ జేసితివి తత్ప్రపంచిత 'యాత్రా'
మాణవకకృతి నిఁకిప్డు డపా నాహుతి వేమనీయ పాత్యంబయ్యెన్॥ 3

క. వ్యానోదానసమానము లైన నలఁతికాలముననె యర్పింపుమయా
పైని న్షడ్రసభోజన మో! నింతువుగాని రససమాహితకృతిలోన్, 4

క. కలషోడశోపచారవి ధులకగు నుద్గ్రంథము న్మధురవాగ్రమ్యో
జ్జ్వలత న్బదపడి కూర్చి స ఫలీకృతి మహార్చనావిభాసివి కమ్మా. 5

తే. భర్తృహరియొక్క త్రిశతక ప్రాయమూచుఁ
గ్రమత శృంగార నీతి వైరాగ్య భాగ
కేవలంబగు 'వేమయోగీయ' మెలమి
నమరు నాచంద్రతారార్కమై ధరిత్రి.

'శ్రీ మద్గురు భాగవత' 'శ్రీ మద్భాగవత మహి' మాద్యనేక గ్రంథ
కర్తలు 'నుభయభాషాప్రవీణ' 'వేదాన్తపారీణ' 'కవిశేఖర'

శ్రీ మిన్నికంటి గురునాథశర్మగారు, గుంటూరు.

తాము మిక్కిలి ప్రేమతోఁ బంపిన 'శ్రీ వేమయోగీయము' ను జదివితిని. పండితకవులగు మీపాత్తమును పాంతముచూడక వదలుదునెట్లు? పదమెత్తిన వృత్త్యనుప్రాసము, పాదమెత్తిన నోజస్సు, నింకయమకముల నెమకనేల? కుప్పలుకుప్పలు. అందును సహృదయమకము నెక్కువగావాడితిరి. ఒక్కొక్క పాదమున నాలుగంత్యప్రాసములతో సీసముల నిర్వహించితిరి. వర్ణనాదులలోఁ

బూర్వకవుల్రతోవలఁ దప్పరైతిరి. 'అలూనకిసలయమ్ముం' గొని నవీనరసమయముగాఁ బ్రసంగించుట మిక్కిలి ప్రసంసగానున్నది. ఎట్టి దుష్కరప్రాస గండశిలయైనను మీయనర్గళధారలో దొరలుకొనుచుఁ బోవలసినదే. ఆటవెలఁదులకుఁ జెక్కనడకలు నేర్పితిరి. శివయోగి స్వరూపము ధరించితిరి. 'కామయాభిఖ్యాతి' పద్యము సాలంకృతమైనదై 'కమనీయవిఖ్యాతి' మీక చేకూర్చును.

ముప్పది నలువది యేండ్లనాఁడే భవ 'ద్యశోవిహా' రాదిక సరణి నవభావ గంభీరముగను నానాశబ్దాలంకారాదిశోభితముగను వ్యంగ్యస్ఫూర్తిగను విరాజిల్లినందులకు నే నాశ్చర్యచకితుఁడ నైతిని. పుట్టుకతోడనే మీరింతప్రౌఢకవితాప్రద్యుమ్నులరై తిరిగదా. అవునవును. శ్రీ పురుషోత్తములకుఁ బ్రద్యుమ్నులుదయించుటలో వింతలేదు.

'మేఘసందేశ' 'కుమారకథామంజరి' ప్రముఖ గ్రంథకర్తలు

'విమర్శకాగ్రేసర' విద్వాన్

దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు, నెల్లూరు.

'శ్రీ వేమయోగీయము చదివి సంతోషించినాను. తాము వేమనను కవిగను యోగిగను చక్కగా తీర్చినారు. అంతియకాక, ఆతనిని ప్రబంధనాయకునిగా చిత్రించుట మీ రచనలో గల విశేషము. అటు శృంగారము, ఇటు వైరాగ్యముకూడ మీ కావ్యమున సముచితమార్గమున నడిపింపఁబడినవి.'

'శ్రీ వేమనబోధామృతసారము'తోపాటు మీరు లోకమున కందించిన తత్త్వసందేశము ప్రాజ్ఞప్రశంసార్హముగా నున్నది. ప్రౌఢమధురమగు మీ కవితాశైలి హృదయంగమమై యున్నది.

'యోగానంద రామాయ'ణా ద్యనేక గ్రంథ రచయితలు

శ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులు కవిగారు, అమలాపురము.

'పుత్రాకృతినున్న ద్రోణుఁడ'వని ద్రౌపది ద్రౌణి న్వర్ణించి నమస్కరించినట్లు మీకిప్డు నమస్కరించుచున్నాను.

మీ 'వేమయోగీయ' మందలి యాధ్యాత్మికసారము పంచదశి జ్ఞానవాసిష్ఠాదులవలె నెంతేని సమాదరణీయమై శాశ్వతామే యాత్మరాస్య పఠనీయమై వెలయఁగలదు. నే నద్దానిని విమర్శనేక్షణైకదీక్షతో భక్తిశ్రద్ధాసక్తబుద్ధితోఁ జదివియూనా వార్ధక్యదుఃఖకంధి కిదే నావగా నెంచియిద్దానఁ దరించుచున్నాఁడ.

మ. అనవద్యంబగు పాండితీగరిమ ముందాసంస్కృతాంధ్రద్వయిం
గన నభ్యాసమొనర్చి యాంగ్లవిదుఁడై, కన్నయ్య కీకబ్బముఁ

జన సమ్మోదదమిట్లొసంగి నిజవైశద్యమ్మును స్వాహరిం
చిన మేధానిధి నావెళాన్వయవిధు న్శ్రీమీఱ శ్లాఘింపరే ?

మదాసు యూనివర్సిటీ, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ
ముల తెలుఁగు రీడర్లు 'నాంధ్రభారత కవితా విమర్శ'నాది కృతికర్తలు నైన

శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, ఎం. ఏ. చెన్నపట్టణము.

......'శ్రీ వేమయోగీయ, 'నీతిభాస్కరము'లు మీతండ్రిగారి యొద్ద
నుండి సాధించి కృషిచేయుచున్న యాధ్యాత్మిక తత్త్వమునకుం బ్రబల నిదర్శ
నములు.........'ఉత్తమ జీవయాత్ర'లోని వివిధ కక్ష్యల యందలి మహ
త్తర గుణములు, సాధనలును జదివి మిక్కిలి యానందించితిని. మరలం జిన్న
నాఁటి బందరు నాదృక్పథమున నిలిచినట్లైనది.

'శ్రీ శఙ్కరవిజయ' 'కూర్మపురాణ' 'ప్రసన్నరాఘ' వాంధ్రీకరణాదికర్త.

శ్రీ భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు, మోపిదేవి.

ఉ. శ్రీగురువర్య పాద సరసీరుహయుగ్మమును న్నుతించి మే
ధాగరిమార్థి నై నతివితానము భక్తిమెయింబొనర్చి స
ర్వాగములన్ క్షమించుచుఁ గృపామృతము న్ఘనత న్వహించి నా
పైఁ గురియంగ వేఁడుచుఁ బ్రపన్నుఁడనై లిఖయింతు నిమ్మెయిన్.

మ. కళలం బోగురుదేవ ! మీదయను మాకుంగా, భవ ద్దివ్యభూ
రిశివంబుం దెలుపంగ సంతతము నర్థి న్వేడెద 'న్వేమయో
గి' శివాపాదక సచ్చరిత్రము లసద్గీర్వైభవం బొప్ప, స
ద్యశ మబ్బ న్రచియించి పంచితిరి గాదా పట్టిచేఁ బెన్దయన్

శా. వింటిన్మీకడ మున్నె దానిదగు పెన్విన్నాణము, న్నేఁడు నేఁ
గంటిం గన్నులముద్రితంబవుచుఁ జక్కంబొల్చు పాత్రమ్ము, వె
న్వెంటం బున్నెపుఁబంట తొంటిది నను న్బ్రేరేపఁగా నోటితో
నంటిన్నంటిని దత్సుధోక్తిలహరీ యాంశాంశము గ్గ్రోలుచున్. 3

చ. గొనముల కెల్లనిక్క దొసఁగు ల్లవమేనియులేని దిందిరే
శుని పదకంజమం దెసఁగుచుం బ్రవహించెడు జాహ్నవీ సుపా
వనతర మాధురీభరిత వంజులధారకు నుద్ది, పూజ్యపా
ద నిహిత వేమయోగి చరితప్రథిమ న్గవిత న్నుతించెదన్. 4

తే. దక్షిణామూర్తి కర్త మేధావిలాసి
వర్ణ్యమో వేమసద్యోగి వరచరిత్ర
నేత కవిపూరుషోత్తమ ఖ్యాతకీర్తి
రస మొలుకఁ గ్రోలుఁడీ వెస రసికులార! 5

'ఆంధ్రచరిత్రాది గ్రంథకర్తలు, వీరేశలింగం హైస్కూలు పండితులు

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రిగారురా, జమహేంద్రి

తాము ప్రేమతో నంపిన 'ఉత్తమజీవయాత్ర' ను 'వేమ యోగీయము'ను నే నందుకొని కన్నుల కొత్తుకొన్నాను. మీ కబ్బములు మహోత్తమ కావ్య ధోరణిలో రచింపఁబడినవి. అందలి పద్యములు ప్రౌఢములై రుచిరములై నన్నానందముగ్ధు నొనర్చినవి ... ఛందోమూర్తులు శాశ్వతులు నగు శ్రీ పురుషోత్తముల పుణ్య చరితమును బద్యప్రబంధముగా రచించుటే మిక్కిలి మంచిది. తమరు జనకులపట్ల అధమర్ణతఁ బాపికొన్న ధన్యమూర్తులు. తమ శ్రీ చరణములకు నా ప్రణతులు.

శ్రీ అప్పల వేంకటరావుగారు, పౌరాణికులు, సామర్లకోట.

మీ 'వేమయోగీయము' నామూలాగ్రముగా మహాసక్తితోఁ జదివి పూర్తి చేసినాను. మీయమూల్యభావములతోడను అఖండమేధాయుక్త భాషాజ్ఞానముతోడను వెలయింపఁబడిన యీ పద్యకావ్యము సౌష్ఠవముతో సాఫీగా నడచినది. భావములకు భాష యలంకారము వెట్టుచున్నది. విషయమునుబట్టి భాష అప్రయత్నముగా వచ్చుస్వభావమై శిష్టప్రబంధశైలిలో సున్నది- భాషాపరిమేయమే మాత్రమున్న పాఠకులైన నందలి చెఱకుతీపి ననుభవింపఁగలరు.

గమనిక.

| పుట. | పఙ్క్తి. | కూర్పు. | మార్పు. | పుట. | పఙ్క్తి. | కూర్పు. | మార్పు. |
|---|---|---|---|---|---|---|---|
| 14 | 4 | భవ్యో | మాన్యో | 33 | 8 | వ్రేలఁ | ప్రేలఁదలన్ |
| 22 | 17 | యామా | యీమా | 70 | 12 | *ధాత్రోపేంద్ర | ధాత్రజ్ఞాత్త |
| 26 | 18 | డౌడు | డగుడు | 71 | 2 | చతుర్ధా | చతుర్థా |
| 29 | 24 | తాత్మ | తాత్మత | 76 | 6 | మాతృ | మాత్రి |
| 30 | 6 | దు, నో | దుఁబో | 88 | 26 | మద్వై | మావై |
| 32 | 18 | రంభా | డంబా | | | | |

* స్థితస్యగతిః :—ధః(బ్రహ్మవిద్యాయం) + అత్రిమ్ (పాయస) మితి.

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# శ్రీ వేమయోగీయము.

## అవతారిక

### ప్రార్థనాదికము.



వాణీశ్వర నిర్జరేశ్వనుత స
చ్చిన్మూర్తి, కాత్యాయనీ
భావాబ్జార్కుఁడు, భక్తవత్సలుఁడు, జృం
భద్దైత్య సారంగరా
డ్దావచ్ఛేదక వజ్రి, నిర్జిత పుర
క్రవ్యాద నవ్యోదయున్
దేవాధీశ్వరుఁ గాలకాలు, ననుసం
ధింతున్హృదబ్జంబునన్.

ఉ. శశ్వ దనూన కీర్తి విలస న్మహనీయచరిత్రుఁ డర్థనా
శీశ్వరుఁ డాతఁడౌట, హృదయేశ్వరి యీశ్వరి పార్శ్వమందుఁ గా
మేశ్వరి తానయుండి హృదయేప్సితము ల్ఘటియిల్ల మాకు ము
దశ్వరధార్థ సంపదల, నంతట మోక్షపద మ్మొసంగెడున్ 2

శా. ప్రారంభించుతఱి న్భువి న్గృతులు, లోపం బెద్దియు న్రామికిన్
హేరంబుం దొలుదొల్త మ్రొక్కుదురు కాదే, యట్టి యావేల్పు నీ
హారాద్రీంద్ర సుతాంకపీఠిఁ దగి నిధ్యానంబు ధ్యానింపమి
స్వైరుం డాతఁ డొసంగె దీనఁ గృతి నిర్విఘ్నంబు గానయ్యెడున్ 3

ఉ. శ్రీయుతమూర్తి భాస్వర చరిత్రుఁడు మాధవు చేతనేతగున్
సాయకమౌట మాధవుఁడు, సన్నుతిపాత్రి దివౌకసావళి
ధ్యేయుఁడు, శార్ఙ్గచక్రధర దివ్యమహాప్రతిభాఢ్యుఁ డట్టి తే
జోయుత నీలదేహుఁడు, వసుండయి మ మ్మనిశమ్ముఁ బ్రోచెడున్ 4

శా. శ్రీరాంభోధిజనించియు న్విజయలక్ష్మీనామముం దాల్చియు౯
హేరాళ ప్రతిభావిశేష మహితాహీ ద్దివ్యపర్యంకగుం
డా రాజీవదళాయతాక్షు బుధగేయప్రాభవోన్మేషునిం
జేర న్దద్ధృదయాబ్జపీఠగు నాశ్రీదేవి మమ్మోముమున్॥ 5

ఉ. ధాతయు వెంటవచ్చుఁగద, తాతనుగూడి వరప్రదాతగాఁ
బ్రాతయు నేత యాతఁడు నరాయణనాభిజలేజమందె, సం
ప్రీతచరిత్రుఁ డుద్భవిలి, భూమి జనంబుల సృష్టిఁజేయు ని
ర్ణేత విధాతనాఁ దనరి, నిచ్చలు వేదచతుష్క వాక్కులన్. 6

ఉ. క్షీరముఁ బుస్తకమ్ము నెసఁగెంగద పల్లకి చేతులందు, నో
భారతి భారతీరమణి, భాస్వర నా కృతులన్ప్రచారకున్
శ్రీరుచిరత్వముం దెలుపఁ జెన్నలరారెడు విద్యఁ దెల్ప, నా
ధీర నిరంతరంబెటఁ బలి స్వాదకే యిఁక నాకుఁ దోడగున్. 7

చ. సరస చతుర్విధాంధ్ర విలస త్కవితావిభవాఢ్యు నెంతు, న
య్యురుతరపారసీక యవ నోత్తమ సంస్కృత హూణ కోవిదుం
బరమసుశాంతమూర్తి బుధవంద్యుని జ్యోతిష ధర్మశాస్త్ర బం
ధుర పటిమాభిరామ గుణధుర్యమహాత్ముఁ బూరుషోత్తమున్. 8

ఉ. ధారుణి నన్నుఁగన్న వనితామణి భవ్యపతివ్రతామణిన్
జారువచోన్విత న్నయవిచార ననారత మేఁదలంతు, శృం
గారసురూపిణి న్మహితకాంచనతుల్యను, మాన్య ముక్తికాం
తారమణి న్నిరంతర సనాతనధర్మ పథైక గామినిన్. 9

వ. ఇ ట్లిష్టదేవతా గురునమస్కారంబులు గావించినతఱి. 10

## కృత్యారంభము.

క. బలుపాడవువాఁడె కోయం గలిగెశేషలమంద బుడుతకడఁగినపగిద్వ
దెలివిం గొలువడనైనను బలువుర కెటో ముదముగదురఁబలుకఁ
దలంపన్॥ 11

క. కవిపుత్త్రుఁడఁగవినయ్యునుగవివరబుధవర్ణ్యమార్గకలితాత్ముఁడనై
భువిఁబుట్టియునొకకబ్బముఁబ్రవిమలమతివ్రాయకున్న భావ్యంబానే?

క. ఘనబుధుఁడు జనకుఁ డొనరింపనుగ్రకృతులవి కాంచినాఁడు పండితపుత్త్రుం
డనరే? ననుఁ, గావున మది నొనరుప నే దైనఁ బూని యొకకృతిఁ
దొలుతన్. 13

క. శతకం బస్మన్మాతృస్తుతిరూపక మాచు నొప్పఁ జొప్పడుఁ జెప్పన్
గతియానని భావించుచు నతిముదమిడ ముందుకొప్ప నయ్యో
నటుండన్. 14

క. తోఁచెన్ ఖండకృతు ల్వెడి వాచాతీతప్రభావ భాస్వరుఁ డనఁ బై
ప్రాచేతసతుల్యుం డా ప్రాచీన కవీంద్రయోగివరకృతిఁ బలుకన్. 15

ఆ. పద్యగద్యములఁ బ్రబంధరూపంబునఁ దనరఁ జేయుపూనిఁ గనినయంత
వేమనాఖ్య యోగివీరుండ కవియాచునీతిబోధ సేయు భాతినెంచి.

క. రాయవరపుఁ గులదీపకుఁ డై యొప్పిన పూర్ణయాఖ్యుఁ డస్మత్పితృ మి
త్త్రాయతమతి గద్యమ్మున నీయుత్తము చరితవ్రాయ నే నదికంటిన్.

చ. ఇపుడు పురాణగాథ యెదియేని రచించినఁ బ్రీతియేరికా?
నుపకృతి తాఁ బ్రపంచమున కొప్పికఁ జేయు మహాత్ముఁ డొట ని
క్కపుఁ జరితంబు నందగిన కాలపువాఁ డతఁ డొటఁ జేసియున్
విపులముగా నెఱుంగ నిటు వేద్య మొనర్చిన హృద్యమయ్యెడున్॥

ఉ. శ్రీయుత వేమనాఖ్యుఁడు తుకీయకులుం డవ్వఁగాక తాను రా
ధేయుఁడు దానమం దెటులొ, ధ్యేయుఁ డితండు నిదానమం దటుల్
జ్ఞేయుఁడుగాఁ జెలంగె, మహనీయుఁడు, తచ్చరితంబు 'వేమయో
గీయ' మన న్రచింతు, బుధగేయ మమేయ గరీయ మీయిలన్.

ఉ. ఆనయమార్గ వేది మహితాత్ముఁడు వేమనయోగివర్యుఁ డ
న్మానివరేణ్యనిష్ఠిత సమంజస సాధుపథైకవర్తి స
న్మానితదివ్యకీర్తి కరుణామయమూర్తి, హతార్తియాతనిన్
ధ్యాన మొనర్చి, తత్సుచరితమ్మును జెప్పఁ దొడంగువాఁడనై .20

ఉ. భారతమాతకుం దొలుత భవ్యచరిత్రకు వీరమాతకుం
జేరిచి నానమస్కృతులు చె న్నలరారినవారి నెంతుఁ బ్రా
గ్భార యశోవిశేషులగు వ్యాసుని భాసునిఁ గాళిదాసుని
న్భారవి మాఘు హర్ష గణస న్భవభూతి మురారి ముఖ్యులన్. 21

ఉ. భారత మాదినేపలికి ఘన్నను గన్నవు నన్నపార్యు, నిం
పారఁ బదేనుపర్వముల నయ్యయియుద్ధుల దిద్దు తిక్కనం
బూరిమ నెఱ్ఱనం బొగడి, పూజ్యుల భాస్కరసోమనాథుల
న్నారసి పోతనార్యు నెద, సన్నుతిసేయుదుఁ బెద్దనాదులన్.22

క. అంతఱ మాత్మస్తుతి పర నిందలపాలౌటఁ గుకవి నిరసనశక్తిం
గందుకొ కావునఁ గాటుక కుం దొరకరయిరి ధరణిని గుకవుల
నరయన్. 23

ఆ. కాన నిద్ది ప్రీతిఁ గనువారికెల్లఁ గేనువినుచువాఁడ నీచరిత్ర
మనుచుఁ గావ్యకన్య కర్హుఁడౌపతియెవ్వఁ డనికొనంగఁ దోఁచె
నరయ నిట్లు. 24

## కృతిపత్యన్వేషణము.

క. మున్నల నన్నయముఖులౌ మిన్నలు కృతులిచ్చినా రమేయప్రతిభం
గన్న నరేంద్రులకిల దాన న్నతి సమ్మాన మందినారటులుండన్॥

క. పాతక మదియౌ నంచును బోతన తా నీయఁడయ్యె భూతలవిభులం
దేతనికిని భాగవతము చేతోముదమార నిచ్చె శ్రీరామునకున్ 26

ఆ. అట్లు కొందఱిచ్చి రవనీశ్వరులకెన్న నిట్టు లేరొ యిచ్చి రీశ్వరునకు
నేనుమాత్ర మిప్పు డింకెవ్వరికి నీయఁ జాలనైతి నద్దియేలయనఁగ॥

ఆ. భోజరాజుఁ బోలు భూకాంతులౌ లేరు,కృష్ణదేవరాయ కీర్తనీయ
మహితయశులు సరసమహీపులును న్లేరిఁ కాదరింతు రేరు భూ
దయితులు ? 28

తే. కానఁ బురుషోత్తముఁడె కృష్ణుఁడౌ నటన్న
నీఁకను బదియాఱువేలు గోపికలు గాక
కొసరు కవిరాజు లొసఁగిన కూఁతు లుండ
నేల యాదరమునఁ జూచు చేల దీని ?. 29

శా. మాతోఁబుట్టువు లైనప్రౌఢసతుల న్మాన్యప్రబంధోత్తమ
వ్రాతంబుం బితృకర్తృకంబును భరింపంజాలు కంభుండనం
జేతఃప్రీతిని జూచునో ముగుద నోఁచెంబో యహా ల్పబస్సనుం
బూత లుగ్గయు గంగ దేహమున నెప్పున్నిత్రిపై కెక్కఁగన్॥ 30

వ. అదియట్లుండ 31

క. కలలోఁగాన్పించెదరఁట యలహరిహరు లట్లువచ్చి యాశీర్వాదం
గలిగినఁ జాతము వేఱొక టలుసాఁ దనయంత నరుగ నంచుం
దోఁచెన్॥ 32

శా. ఏదోదయ్యము కానుపింపనిది లేనేలేదో! యున్నం గనం
గాదో! యట్టిదె యిష్టదంబవు నెటు లన్వేషించి తాఁజెంచి, ని
ద్యాదానం బొనరించి నుంచు గురుని ధ్యానించి సేవింప నే
దేదైన న్వ్రాంచి కెంచుమాత్రమునఁ బ్రాప్తించుంగదా సౌరికిన్ 33

శా. 'ఆయేదో ఫలదంబటంచు వినలేదా'? యందు కే న్వింపు చే
ధ్యేయంబా గురురూపమందు నదిలేదే స్వర్గం బెట్లగున్?
భూయఃకల్పిత వందనాదికముల న్బొందింపఁ దద్బుద్ధితో
డాయ న్వచ్చి తదాకృతి న్ఫలము రెంటం గూర్చు టబ్రంబొకో!

క. ఆదరమున నాకృతిఁ గనఁగాఁ బశుపతియెవ్వఁడన్నఁ గనుగామయుఁడు
నోసదాపుఁడు సుజనకుఁడై కాదే గురుఁ డతఁడ నాకుఁ గనఁడే
ప్రీతిన్? 35

చ. తనయులపల్కు లెన్నఁగను దప్పులకుప్పలె యైనఁగాక, యె
ట్లును ముదమిచ్చుఁ దండ్రులకు, లోలతఁ జెంచు సహించుఁ గావునన్
జనకుఁడె ప్రీతిఁ గాంచఁగ నిజాత్మజ సత్కృతికన్యనిత్తు, నా
తనికిఁ గవీంద్రశేఖర బుధప్రవరోత్తమ వర్ణ్యబుద్ధికిన్॥ 36

తే. ఇపుడు కౌమారదశయందు నెసఁగునతఁడు
నాదు జననియొ, దివికేగె నాదుకొనుచు
మోద మిడ వార్ధకమ్మున నాదుహితయొ
తప్ప లేరెరు దరిఁజేరి మెప్పఁగూర్ప॥ 39

క. సోదరులు లేరు నాకిఁక సాదంగా నతనిఁజేయ సానందాత్మన్
మోదంబిడ నిహపరముల నాదుకొన న్నన్నదమ్మ నాతఁడ కాదే!

తే. కాన నాతనికే కృతి యే నొసంగ
ననుపమానందుఁ డతఁడౌట యట్టులుండ

వన్నె కెక్కను ముఖ్యమై యున్న నిద్ది
దాన నేనును రక్షియింప నౌను గాదె. 39

క. గురుఁడే బ్రహ్మయు విష్ణువు గురుఁడే మహేశుండటంచు గురుఁడే సాక్షా
త్పరమై పరత మనియనరే? గురుఁడనఁగా నట్టిఁడౌట గురునకె యిత్తున్.

క. గురుభక్తి న్నెఱపక్కనరుఁ డెట్టిఁడు ముక్తినందు న్యాయ్యంబకదా
పరమాంగన ప్రీతిమెయిని పరునాతని జేయఁగా వ్యవరమునకిపుడేన్.

తే. కొంచె తలక్రిందు నుండాగ గులకఱాల
కొఱకు నేడనొ వెదకంగఁ గోరుకన్నఁ
జెలిమితక్కన వేఱుండఁ గలుగునొక్కొ!
అట్టిదే కాదె! గురుపిడి యరయుటయన. 42

తే. మఱియును బిత్రాణ మెన్ని జన్మముల నెత్తి
యైనఁ దీర్పఁగ శక్యము కానిదయ్యె
నట్టి దొక్కింత యేనిప్పు డిట్టులీఱు
మార్గ మునిఁగిన నెట్టు లపవర్గ మబ్బు? 43

క. నరమాత్రులు నరపాలురు సరసులు గారెఱుఁగఁ గృతుల సారస్యంబున్
హరిహరులో మాటాడను గురువరుఁడో బుధుఁడు తెలుపు గుణ
దోషంబుల్॥ 44

క. కావున సర్వవిధమ్ముల భూవిశ్రుతపుణ్యమూర్తి పురుషోత్తముఁడే
కావ న్నను, మత్కృతికన్యావరుఁడై యేలనర్హుఁడౌ నెటులరయన్.

క. వేమనపద్యము లన్నియు ధీమంతుఁడు మద్గురుండె దిద్దెనుగాదే
నీమమ్మున నేని ప్పిటు లామహితు చరిత్రి వినుపనతనికిషితుఖా.

చ. అభినవదండి కేతనసమాహ్వయ సత్కవి తిక్కయజ్వనా
మ భజనసేయఁగా దశకుమారచరిత్ర మొనర్చె నంకితం
బభినవతాప్తి నా కొదవదై నను దిక్కన సాటిమేటియౌ
నభినవ వేమ రంగగురుఁడౌ పురుషోత్తముఁ డేలు నీకృతిన్. 47

వ. అని కృతనిశ్చయుండనై నారచించు నీ 'వేమయోగీయము' న్పురుషోత్తముండౌ పురుషోత్తమునకే యంకితంబుగా రచింపంబూని తొలుత నస్మత్కృతినాథు వంశావతారక్రమ్మాదు తెంతునెట్లన్న.

## వంశావతారము.

మ. ధరణీ న్విప్రకులీనులై విహిత వేదవ్యక్త సన్మార్గులై
హరితశ్రీశ్వరగోత్ర జాతులనఁ బ్రఖ్యాతాన్వవాయంబులన్
వఱలంజాలిరి భారతావనిఁ గృతాపస్తంబసూత్రోక్త భా
స్వరకర్మాన్విత వైదికోత్తముల శశ్వత్కీర్తివర్ధిష్ణులై! 49

తే. వారలందగు వెలనాటివారి శాఖ
యందు 'నాదెండ్ల' యనుపేర నలరునూర
వరతపోధనుఁ డైనట్టి పరమపుణ్యుఁ
డరయ నరసింహభట్టన నెగడె నొకఁడు. 50

ఉ. ఆతఁడు నిత్యనిష్ఠను జపాచరణం బొనరింపఁ జేరెఁ గృ
ష్ణాతటినీతటాంచల విశాలవనావృత కీరశారికా
గీత మనోహరానిల వికీర్ణ తరుప్రజ పుష్పరాగ సం
ఘాత జనాతపార్తిహర కమ్రఘలేశ్య వరప్రదేశమున్॥ 51

క. మహిఁ సీతారామపురాగ్రహార నామంబున నది రాజిల్లె నట
న్మహితనరసింహమునిచేయ హవ్యకవ్యములతిథిజనాదరణంబున్॥

క. నాగేశ్వరుఁ డుదయించెను భోగీశ్వరవర్ణనీయ పుణ్యచరిత్రన్
ద్యాగీశ్వరుఁడనఁదగనై నిగమాగమవేత్తృత్వమబ్బునసముఁడు నాఁగాన్॥

మ. దరహాసాంచితవక్త్రుఁ దత్తనయుని దైవజ్ఞచూడామణిం
జనసంపాదితసద్యశోధనుని భస్మీభూతసర్వాఘు, ని
ర్జరతుల్యావనిపాల సేవిత పదాబ్జాతద్వయు న్వేంకటే
శ్వరసిద్ధాంతిని మించువారలరిరే సర్వంసహం జూడఁగన్? 54

శా. బ్రహ్మణ్యుల్సుతు లిద్దఱాతనికి సభ్యస్తాగమజ్ఞానులై
బ్రహ్మన్నిష్ఠా నిరాకరింపనగు సత్ప్రాగల్భ్యముం గాంచుచున్
బ్రహ్మానందముఁ గూర్చి రాపితకు శంభ్వబ్జాతు లట్లొప్పి, సు
బ్రహ్మణ్యాహ్వయ కృష్ణనామ మహితప్రజ్ఞాయుతుల్ ధీయుతుల్.

క. అం దగ్రజుఁ డలభూమీ బృందారక బుధవరేణ్య బృందామందా
నందద మందారము గురు వందారుఁడు సుబ్బయార్య వరుఁ
డెన్నంగన్ 56

తే. కాలినడ నేగి నిరుమార్లు కాశి కతఁడు
  నంత రామేశ్వరమ్మున కట్టు లెచనెఁ
  బట్టుపలనెన్న నాతండె దిట్టసుండు
  నట్టి కామాఖ్యుఁ డుదయించెఁ బ్రథితయశుఁడు. 57

సీ. కామయాభి ఖ్యాతి కమనీయవిఖ్యాతి
    సత్కావ్యతే ఖ్యాతినేయ విభూతి
  స్తుత్యార్చ్యతిజ్యోతి నిత్యకర్మప్రీతి
    హోమపవిత్ర ద్ధాతిధూమ హేతి
  నిగమాగమాధీతి సుగుణబోధ్యజ్యోతి
    హామృతిసా రేతిహాసకీతి
  ప్రాప్తాపవ ర్గాతిపథగమ్యనిర్ణీతి
    దివ్యప్రభాపీతి ధీప్రసూతి

తే. నీతి సూరినతిస్ఫీత నియతవృత్తి
  విత్తి వాచస్పతిజ్యోతి విప్రవృత్తి
  వృత్తి వ్యావృత్తిపాత్ర ప్రసత్తి సత్తి
  బత్తిని బ్రపత్తి విపత్తి బుత్తి ముత్తి. 58

ఉ. కాంచిన మేరుధీరుని దిగంతర నిర్మల కీర్తిచంద్రికా
  కాంచనదేహకాంతి జిత కామ జయంత వసంతరూపుఁ గా
  మించి వరించి మించె నలమించును మించినసుందరాంగి స్తు
  త్యాంచితభావ సద్గుణకదంబ యనందగు సుబ్బమాంబ తాఁ ॥59

క. వారిద్వర కుదయించిరి ధీయుతులు సూరులు తనయు లుదీర్ణప్రతిభుల్
  శ్రీరుచిరాకృతివిలసితనారీమణు లైనసుతలు నవ్యగుణాఢ్యల్ ॥60

క. ధరఁ బుట్టిన హరిహరులో 'నరనారాయణులో కో' యనందగి రందు
  న్వర సుబ్రహ్మణ్యేశ్వర పురుషోత్తమనామ వేద్య బుధజనగేయుల్

క. వా రిద్వరనెయ్యమ్మది శ్రీరామానుజులదైన చెలిమింబోలెన్
  దీ రరయఁగ ధర్మజనర వీరాభులు వార లనఁగ వెలసిరి భువిలోన్

తే. అట్టివారల నగ్రిజుఁ డైనయతఁడు
  బుధవరేణ్య సుబ్రహ్మణ్య పుణ్యగణ్య

వర్ణ్యచరిత్రుండు మహితుండు వరగుణుండు
గురుఁడుఁ బ్రేమాకరుండు సోదరుఁడు నగుచు. 63

తే. దక్షిణామూర్తి సన్మంత్ర దానమొసఁగెఁ
డాతఁ గవితావిధాన సంధానగరిమఁ
గాంచి, "పితృసమో జ్యేష్ఠ" యటంచు నెంచి
యాజ్ఞ మీఱక వర్తించె ననుజుఁ డితఁడు. 64

## కృ తి ప త్య భి వ ర్ణ న ము

సీ. ఆఙ్గ్లేయపారసీకాంధ్రగీర్వాణహిం
దూస్థానభాషా బుధుండు డవ్వుచును
సుచతుర్విధ కవిత్వప్రౌఢి సద్గ్రంథ
ములఁ గూర్చి యవధానములను దవిలి
భవ్యహిందూస్థానభాష ముప్పదిరెండు
నాటకమ్ములవ్రాసి సాటిలేని
దైవజ్ఞుఁ డనఁదొప్పి దైవాలయము దీసి
సేవ కోడూర నడపించి మించి

తే. యుచిత మ్మసంఖ్యాతి గడించినాతఁ
డలరు నాచెళ్ళపురుషోత్త మాఖ్యఁ దనరఁగ
నుద్యముఁడు మహితుండు శీలు ధీరుండు
సజ్జన నుతుండు ఘనముండు శాంతుఁ డవని॥ 65

సీ. రమ్యాద్భుతోత్తరరామాయణ సురభ
క్తిప్రభావంబులుఁ గృష్ణమహిమ
మొదలౌ ప్రబంధము ల్పదికొండు నభివర్ణ
నావళి పదియాఱు నాంధ్రయవన
నాటకమ్ముల నెన్న నలుబదొక్కటి కబ్బ
ము ల్చిన్న వెన్నియో బుడుతలకును
బ్రకృతిరూపప్రకాశికయు వికృతిరూప
చంద్రిక తెలుఁగున సంస్కృతమున॥

తే. సస్యరూపదీపికయన నలరునదియు
వెనసి యూడునిఘంటువు ల్సరవి నింక
బుధవిధేయనిసంచిక ల్పదిపదులును
వ్రాసినట్టి శతాధికగ్రంథకర్త॥ 66

సీ. బాలకావళిఁ గూర్చి పాఠశాలను జేర్చి
సతిబోధ లొనర్చు నిపుణతముఁడు
జాతకమ్ములఁ గాంచి ద్యోతక మ్మొనట్లు
లాగామిఁ దెలిపెడి జ్యోతిషికుఁడు
ధర జనమ్ములలోని తగవు లెన్నియొ మాన్పి
తగవుఁ దెల్పఁగఁజాలు ధర్మవిదుఁడు
నిరుపాధికులు నూపు లరుదేర నియమున
ధనమిచ్చి యిప్పించు దాతృవరుఁడు॥

తే. బుద్ధిగేస్మృతి యసదృశబోధకుండు
శుద్ధవిజ్ఞాని నిరుపమశోధకుండు
శ్రద్ధధానుండు ననమానసాధకుండు 67
సిద్ధచరితుండు మహనీయుఁ డీఘనుండు

తే. ఓర్పు నోపిక యొద్దిక నేర్పుఁ దీర్పు
వినయము నయంబు ననయంబు వినుతములయి
ఘనతఁ బెంపొందఁ జేయంగఁ గనదనూన
శస్తకీర్తి నెసంగెడి సాధు వితఁడు॥ 68

శా. భూతానాగత వర్తమాన విషయంబుద్దెల్పు దైవజ్ఞుఁడై
జ్యోతిశ్శాస్త్ర కలాకలాపములఁ బ్రజ్ఞావైదుషీ శేముషీ
చాతుర్యమ్ముల నెల్లఁ జూపి యివి ధాశావ్యాప్త సత్కీర్తి వి
ఖ్యాతుండయ్యెను బూరుషోత్తముఁ డనన్యప్రాప్త నైపుణ్యుఁడై॥

ఉ. ఇమ్మహి నాంధ్రకావ్యముల నెందును జూచిన సాటిలేని ప
ద్యమ్ముల బంధగర్భకవితాదృతిఁ జూపుచు హిందిభాష లో
కమ్మున నన్నెకెక్కఁగ నఖండుఁ డపూర్వపురూపకాళి రం
గమ్ముల నాడఁజేసి, కవిగాయక కీర్తిత సచ్చరిత్రుఁడై॥ 70

ఉ. చక్కని వాక్యజాలకము సాగఁగ నద్భుతశాస్త్రలక్షణ వ్పన్నస
న్నైకుల లలంకృతు ల్పరిణపేయము లౌఁగతిఁ జెప్పవొప్పున
న్నిక్కపుభక్తియుక్తి ధరణీస్థలి నీతిఁ దనర్చువైఖరిన్
ధిక్కృతతిక్కయజ్వగ సుధీనరవర్ణనమీతఁడుండఁడే ? 71

మ. విపులప్రజ్ఞఁ డితండు పల్కుకృతు లుర్వి న్సాటిలేకుండు, వ్య
ర్థపదం బేడను గానరాక బహుశాస్త్రార్థద్యోత కాచ్ఛప్రబం
ధ పరిష్కార సమన్వితంబులయి విద్యాపారధీమంతుఁ జూపెడు
న్విపరీ తోత్తమబంధనస్ఫురితతా విస్ఫూర్తి సంకీర్ణముల్॥ 72

శా. ఆపద్బాంధవుఁ డీతఁ డౌననఁగ వైద్యప్రక్రియ న్నేర్చి యే
రాపన్నుల్దనుఁజేరి కోరిన, సహాయార్థంబుగా నేగుచు
న్బ్రాపై యాపద మాపఁజూపెడిని లోపం బేరి కేందుండినన్
దీపం బంధతఁ బాపఁజాలునటుల న్దీర్పంగ నూంకించెడున్॥ 73

తే. ధరఁ "బరోపకారార్థ మిదంశరీర"
మనెడునార్యోక్తి కెఱుఁగఁగ నవతరించెఁ
దాను దానను బురుషోత్తముఁడె యనఁగ
సార్థనామ్యను జెన్నొందు సత్పురుషుఁడు॥ 74

క. చేసినసరాత్రముల న్దా విద్వ ద్విప్రసాళిఁ దగునీతి న్సం
భావన మొనరుచుచుండెడు పావనుఁ డాతండు తానెసండితవరుఁడై॥

తే. గురుఁడు పురుషోత్తమ హితాచ్ఛగురుయశుండు
ధర్మగుణకర్మ నిర్మాణ మర్మవిదుఁడు
గురుఁడు పురుషోత్తమహితాచ్ఛ గురుయశుండు
ధర్మగుణ కర్మ నిర్మాణ మర్మ విదుఁడు. 76

క. పురుషోత్తమ చరితమ్మునఁ బురుషోత్తమవర్ణనీయ పురుషార్థదమై
పురుషోత్తమ చరితమ్మునఁ బురుషోత్తమవర్ణనీయ పురుషార్థదమై॥

శా. సారాచార నయప్రచారపథ సంచారైక చారుక్రియా
సారోదార విచారసారుఁడు దశాశావ్యాప్త సత్కీర్తి వి
స్తారుం డాశ్రిత సూరివార బహుళోత్కంఠౌఘసంధాన మం
దారుండై తగు పూరుషోత్తమకవీంద్రగ్రామణి శ్రీమణీ 78

## నిజమాతృదేవి

క. చేపట్టిన నాఁటిమొదలి యోపదులను దాసిమంత్రి యోజించుతఱిన్
రూపమ్మునఁ దా నగు శుభసాధ్వి పుడమి జనని పెరిమ శయనరం
భయునై॥ 79

క. ఘన జన్మలమడకాన్వయమున సీతారామనామ భూసురునకిలన్
దనయుఁడు లక్ష్మీనారాయణశాస్త్రి యనంగ నొప్పునతఁ డల
రంగాన్॥ 80

క. ఆలలిత తత్త్వ విద్వన్మౌళికి సతి రాజ్యలక్ష్మమకు సుతయై ల
క్ష్మీలావణ్యాంచితయై కాంతి న్భవిఁబూత ముక్తికాంతామణి
నాన్॥ 81

సీ. తనతండ్రి సంతతాధ్యాపిత ప్రస్థాన
శాస్త్రత్రయజ్ఞాన భవ్యసుమతి
తనతల్లి భర్తృసేవసలబ్ధ వేదాంత
విజ్ఞాన సంపూర్ణ విమలచరిత
తనయత్త లోకజ్ఞతా సాధుశీలతా
సంపూర్ణ కరుణార్ద్ర సత్స్వభావ
తనభర్త దక్షిణాస్య నిరంతర ధ్యాన
సంప్రాప్త బహుకలార్జన మనీషి

తే. తాను సార్థక ముక్తికాంతామతల్లి
తల్లి కెనయైన విద్యానిధాన మనఁగ
మనఁగలిగె నత్త చిత్తరంజన మెసంగ
సంగతోత్తమ పతిభక్తి సంయుతాత్మ॥ 82

క. పాతివ్రత్యమునందిల నాతన్వి నోర్చల రతిన లారయ నేరుం
బ్రీతి న్నీతి న్భాతి న్లాతిసతు లీటుగారు లావణ్యమునన్॥

క. ఉత్ప్రేక్ష లేదొకింతయుఁ దత్త్వాశస్త్యంబు నెన్నఁదరమే మనకున్
సత్త్వాభవముం గాంచెను దత్త్వాగల్భ్యం బతీతధన్యతఁ గూర్పన్॥

తే. ధర్మమార్గైక వేదిని ధర్మపత్ని
మర్మ మెఱుఁగనియిల్లాలు మహితచరిత
కర్మములఁ దోడుపడు చెంపు ఘనతఁబెంచి
నిర్మలంబైనహృదయంబు నెగడుసాధ్వి॥ 85

## కవితా సంబోధనము

మ. తనరంగాఁ బురుషోత్తమాఖ్యకవి శాన్తా ముక్తికాన్తామణీ
తనయుండం గవితాధురీణుఁడను మేధావత్సోమమూర్తి శా
స్త్రిని, విద్వజ్జన పాదజీవనజ వర్తిం గీర్తిమన్ముఖ్య వే
మనయోగీంద్రచరిత్రమేను రచియింపంగాఁ గవిత్వాకృతీ !
శా. సంభావించితి నన్నయాచితముగా సంపర్కమున్ గోరుచున్
రంభోరూ! జితరంభ ! యెల్లయెడఁ బ్రారంభంబునం జూపునీ
గంభీరోత్తమవాక్ప్రచారములతోఁ గైసేసి యత్యంత సం
రంభోత్సాహ పరాక్రమస్ఫురణ దేగంజూచికొమ్మీకృతిన్॥

## షష్ఠ్యంతములు

ఉ. శ్రీనయితానువర్తికి వశీకృతశైవకృపా కృపాణ వి
చ్ఛేదిత పూర్వజన్మకృత శేష విశేష విపత్పరంప రో
త్పాదిత దుర్భరార్తికిఁ బ్రబంధసునాటకకర్తృతాది సం
పాదితభూరికీర్తికిఁ దపఃపరిపూర్తికి రమ్యమూర్తికిన్. 88
ఉ. శాంతగుణైకమూర్తికి దిశాంతనిరాజిత దివ్యకీర్తికిన్
దాంతివిశేషభూషితనితాంతముదావహ దక్షిణాంగ దై
త్యాంతక పాదయుగ్మ విధృతాంతర నిర్మలసద్హృదబ్జ వే
దాంత రహస్యవేత్తకు ననంతపరోపకృతి ప్రశస్తికిన్॥ 89
ఉ. ధీకవితాచమత్కృతి కుదీర్ణ యశశ్శరదిందుచంద్రికా
శ్రీకమనీయ చంచదధరీకృత సత్కవిరాజకీర్తి క
స్తోకబుధోత్తమోత్తమ వచోవిలస త్పురుషోత్తమోత్తమా
ఖ్యాకునకు న్సమర్పణముగా రచియించెద నీప్రబంధమున్ 90

ఇది యవతారిక

# శ్రీ వేమయోగీయము

## ప్ర థ మా శ్వా స ము

క. శ్రీపురుషోత్తమనామా కాపురుషాఘనువిరామ కామాపహా సే
వా పరతంత్రకవీట్సో మా పరమోత్కృష్టకామ భవోద్దామా! 92
వ. అవధరింపుఁడు

## పు ర వ ర్ణ న ము

చ. పరఁగు నాంధ్రభూమి నొకక్కెడఁ సుభ్ర స్వప్రప్రదేశాంచితాం
బర చుంబి ప్రతిబింబి తామరసతీ వక్షోజసీమా నట
త్తరళోత్కీర్ణ మణిచ్ఛటాకటక సౌధవ్రాత నిర్యాత సుం
దర నప్రాయత పట్టణం బది సుభృద్వర్య ప్రభాధామమై॥ 93
చ. తనరు ననేకభూరుహవితాన ముదానహమైనచోటఁ బా
వనమగు కృష్ణవేణిదరి వర్ణితమైన త్రిలింగమధ్యమం
బున శివలింగమొయాన నభోమణిమండల నుంటునట్టి కుం
శిఖ ధరణీధరంబుపయి నిస్తుల రాజనివాస భాసమై। 94

ఉ. భాసురకాంతి ధిక్కృత దివాకర వహ్ని సుధాకరేక్షణా
వాస విలాసలాసిత నవాసవఘాత నగాధిరాజ కై
లాస కలాకలాప విగళన్మణిమండిత మండలాంచిత
శ్రీసమ రాజితాగ్ర నగరీగరిమంబునఁ జెన్నుమీఱునై॥ 95

తే. కొండ గట్టినవీడౌటఁ గొండవీడుఁ
గుండినాగ్రమునందున్కిఁ గుండినంబు
ననెడిపేరుల నలరారునట్టిదాచు
వన్నె మీఱినదై యొప్పు వాసిచొప్ప॥ 96
తే. వెండికొండనుమించిన దండికొండ
యండమైయుండ నట నేలుచుండు ప్రభులు
ప్రతిభ మించిరి కైలాసపతిని మతిని
మంతుఁగాంచినవార లమందగతిని॥ 97

సీ. సువర్ణమయమైన యుర్వీధర మదేల?
ఇది సువర్ణమయ మహీధరంబు
రావణుం డొకచేత లేవనెత్తెరు దాని
రావణుం బిడు నిది లేవదాట
తద్రాజరాజాప్తు తలనెక్కె నొకరాజు
రాజాధిరాజులే రాజులీడ
నెక్క నెద్దొక్కచో యీసునసుదిక్క
గజ తురగసహస్ర గణము మించు
బూనిఁ బూసి కపాలి ముష్టికై వెడలంగ
భూతి కిక్కలు పెక్కు దాంత లిట్టను
బాణు వాకిటను గావలియుండ సాంబుండు
బాణహస్తులె ద్వారపాలు రిచట
నుమయుండ జటగంగ నొర్తుని నిల్పెను శంభుఁ
డేకపత్నీవ్రతు లిందనఘులు
ముక్కన్నుఁ జెఱచెడి ముక్కోపి కామారి
శాంతమూర్తు లీ శేల శస్త్రగుణులు
తే. తాన యొకమూల దూరె నీశానుఁ డతఁడు
కుండినపురీశకీర్తి యఖండమాచు
దెసలకుంబ్రాఁకి యెల్లెడఁ దెల్లవాఱఁ
దనదు గిరివాహనంబులే కనఁబడమిని. 98
ఉ. భారతమాత కంచుకము పచ్చని దొంగు ధరింప సంమలోఁ
దోసపుగబ్బిగుబ్బయనఁ దోఁచెడి కుండినభూధరంబు శృం
గారవనావృతంబు పయిఁ గప్పిననీలదుకూల మట్టిదై
చారుతరాంబరంబు విలసన్నవశోభల నీనుచుండఁగన్ ॥ 99
ఉ. భూమికుచాగ్రమోయనఁగఁ బొల్పెసలారఁగ భాసమాన శో
భా మహితేంద్రనీల మణిమండిత సద్విభవాభిరామమై
ధామ కృతోత్తమానవిపధామ సుధామయ ధామ మొప్పెడి
న్ధామ సుధామ శత్రువసుధా మహిళాధమ ధామభీమమై॥ 100

మ. పరిఖాభీలము భూధరోన్నతతర ప్రాకారవారమ్ము గో
పుర మంటంగలగోపురమ్ము మహితమ్ము న్మత్తదుశ్శాత్రవే
శ్వర దుర్భేద్యము దుర్గదుర్గమముగాఁ బ్రాసాదశోభాయుతం
బుర తేజోయుత రాజధాని తగు సర్వోత్కృష్ట నిర్విష్టమై। 101

ఉ. ఏనుఁగు లానగేంద్రమునకే జనియించిన కొండగట్టులో
నా నలరారుచున్నవి ఘనత్వ మహత్త్వ పటుత్వసంపదన్
మేనుల బొందికంగనఁగ మేరువుఁ గేరెడి తీరెసంగు గం
గానదికై కరంబిడి పెనంగొని లాగ సువర్ణకాండముల్। 102

ఉ. ఘోటకరాజసంతతు లనూనిత బాహుపరాక్రమాఢ్య వా
చాట పరాటకి ప్రకట శత్రువిదారణ దారుణాస్త్ర సం
స్ఫోట విశంకట స్ఫుటన భూభృదశేషభటాధిరూఢముల్
వీట నెసంగెడు న్బవనవేగము మించుచు వేగులం చనన్. 103

చ. సరసిజసంభవుండు కలుషం బొనరించుటఁ గోలుపోయెఁ దా
శిర మొకఁడంచు నాతనిఁ ద్యజించి సరస్వతి యేగుదెంచి త
త్పుర ధరణీసురాత్త గుణపుంజ వినిర్మలకీర్తిశాలురం
దిరవు ఘటించికొన్న దన నేర్పడెఁ దన్నిగమాగమజ్ఞతన్॥ 104

ఉ. చెన్నువహించి తత్ప్రభులు శిష్టజనావన దుష్టశిక్షల
న్నెన్నికకన్న మిన్నయగు విన్ననువుం గనియున్నవారలో
సన్న నెఱింగి వారికిఁ బ్రసన్నమతి న్సతియయ్యె భూమి, ద
ర్పోన్నతి వార లంద మహిమోన్నతిఁ దాను వహించె ము
న్నిటన్॥ 105

చ. కలుములబోటి కాపురము కాపుర మర్త్యసతీజనావళి
న్బలువుర ధర్మభూషణవిభాసిత సుందరవిగ్రహాఢ్య శో
భలఁ దనరారఁజేయుచు శుభప్రద కార్యపరత్వబుద్ధి నె
ప్పిల జను లొప్పఁజేసెడి నహీన సుదాన నిధానసంపదన్. 106

ఉ. భద్రద కార్యనిర్వహణ భద్రమనో వినయప్రచార సౌ
భద్ర పరాక్రమాఢ్య బలభద్రసమాన సుబాహుశక్తులై

భద్రసమృద్ధులై తగిరి భద్రపదాంబుజ భక్తియుక్తులై
భద్రసురావళి ప్రభవ భద్రసమాజ్ఞన భద్ర శోభితులై॥ 107

సీ. 'భ్రమరము ల్గ్రాలని పద్మముం గను'మన్న
మొగముపై నివె లేవె ముంగురు లని
'కుందకుట్మలము లేదందగునో కొక్క' నా
మచ్చుఁ జూపఁగఁ బలువిచ్చి నగెడి
'మంకెనపూవేడ మంజువాణీ!' యన
'మంజు వాణి నే' యను మంజుళముగ
'మంజరీ! యిం మన్మనమంజరీ ద్యోతయమ్మ'
'మంజరి కెనెనొ కొనంజను' నను॥

తే. కలువ లడిగినఁ జూపెడిఁ గన్నుదోయి
సంపెగ యడుగఁ జూపు నాసాపుటమ్ముఁ
బూవు లమ్మెడి యాపిటి పూవుఁబోఁడి
సరససల్లాపములఁ బొంద సరసుఁ గలిసి॥ 108

సీ. అల్లిక సిగఁజుట్టి మల్లెపూవులఁ బెట్టి
సన్నచీరనుగట్టి సరిపెఁబట్టి
తమ్మల మ్మిడనోటఁ దావి యత్తరుచాట
గడపనే తగి బాటఁ గాచిపీట
యునకు లే రరుదేర సవరించికొని చీరఁ
జిలునగవుఁ జేతఁ జెల్మిఁ జేర
నుచ్చుపులనుజిక్క మచ్చులోఁబడిపక్క
వాకిట నొక కుక్క వలెను ప్రుక్క॥

తే. గర్వ మడఁగించి పొగ రెద సర్వమడఁచి
పీల్చి యొంటనింటను వానిఁ బిప్పిఁ జేసి
జోగిఁ జేసియుఁ దుదను బైరాగిఁ జేసి
విడుచు నచ్చోటి వెలబోటి వెతలమీటి॥ 109

వ. ఇట్లఖిల సంపద్విశేషాకరంబై యనవరతశోభాకరంబై తత్తత్సమాగతానూన శ్రీకరంబై కరంబుఁ జెన్నువహించు నప్పురవరంబు,

## వేమనబాల్యము.

మ. ఒకనాఁ డాంధ్రి యశోవిశాలతను సర్వోత్కృష్ట నిర్విష్ట నా
యకతం గాంచిన రెడ్డిభూమిపులకావై పేరిమి న్మీఱుటన్
సకలైశ్వర్యనిధాన మద్ది యనునాసం జేర వార్వీరు నాఁ
టికినిన్నేఁటికి సాటిలేని దగుపేటిం జెప్పఁగా నేటిదై॥ 111

ఉ. రెడ్డికులీనులందు భళిరే! ధనసంపద దానశీలతన్
సడ్డయు బత్తికల్మిఁ గలుషాపహ సత్యవచఃప్రభావ్యతన్
దొడ్డయశంబుఁ గాంచిన ఘను ల్లలవీడని యూడఁజేర నే
ర్పడ్డకుటుంబము ల్దనరు, వారల నొక్కఁడు వేమనాఖ్యుఁడై॥ 112

చ. జననము నందినప్పుడె ప్రజాతకుఁ బ్రేకను మాత కాతఁడిన్
జనకునకు న్సమస్తజన సంతతికిం గన నేత్రపర్వమా
ననుపమరూపసంపదకు నాకరమై కర మింపుమీఱు వి
న్ననువున నన్నయన్న విగతాత్మజ యెన్నఁగఁ గన్నదన్నమైన్॥

తే. తల్లికన్నను గారాముఁ దా నొనర్చి
ముద్దుమఱఁదిని దరిఁజేర్చి మురియుచుండె
నెత్తికొని యెప్డు క్రిందఁ గా లిడఁగనీక
యేమికోరినఁ దెప్పించి యిచ్చుచుండె॥ 114

తే. కనినమోహముకన్నఁ బెంచినదె యెక్కు
డన్నమై నన్నభార్య వేమన్న నెపుడుఁ
బెంపుడుకుమారునట్టులఁ బ్రీతిఁగనుచు
నెత్తునను బొత్తునను బెంచె నెంతయొ తమి॥ 115

తే. కలిమికలిమినె చదువబ్బఁ గలుగు టరుదు
గాఁగ గారాము జతపడఁగా నిఁకేమి?
గాలిపటముల నాటలఁ గాల ముడిగె
సాములనుమేటి తానయ్యె సాములందు॥ 116

క. తా నాడినదే యాటగఁ దా నెయ్యది పాడఁ బాట యందదన యనమిఁక్
బోధాత్ముఁడో యనిపింపఁగా నా స్వాతంత్ర్యవిధిఁ గదలుచునుండెన్॥

తే. కాని యన్నిటఁ బరికించి కాంచుచుంట
'మకురుపా' లైనను నిసర్గమార్దవమ్ము
కొంతయుంటయు, దుష్టులఁ గూడకుంట
సుగుణ మనుకొంగ యౌవనశోభ తసర: 118

ఉ. వేమన పాపదూరుఁడు పవిత్రపురాకృతపుణ్యశేష మిం
కేమిరోయియుండి తా ననుభవింపఁగ మాతృసుగర్భశుక్తిము
క్తామణినా జనించె మహిత ప్రథిత ప్రణుత ప్రతీత్య లో
కామితసుందరాకృతి వికస్వర సుస్వర భాస్వరుండుగాన్. 119

క. ఆగర్భ శ్రీమంతుఁడు త్యాగమ్మునఁ బేర్మిఁగాంచు నట్టిఁడు తానై
భోగమ్ముల కిరవొందన్ రాగమ్మున సఖులు వొగడ రంజిలు
నెడలన్॥ 120

## వసంతర్తు వర్ణనము

ఉ॥ అల్ల వసంతకాలమున నల్లన నెల్ల జగంబుఁ జూడ, సం
ఫుల్లతఁగాంచి మించుచు నభోంతరమంతయు వింతవింతకాం
తుల్ల లితమ్ములై యెసఁగ దోహలదామిత చారుపల్లవ
ప్రోల్లసితమ్ములై తగఁ దరు, ల్మరుకేళిని జంతుపాళియున్. 121

చ. వనతరుశాఖలందు నవపల్లవభక్షణముం బొనర్చుచుం
గనఁ గడుఁ బోతరించిన శుకంబులును న్పికశారికావళుల్
వినవిన నింపు నింపునన వీనులసొంపు దలిర్పఁ బాడుచున్
జనముల నెట్టివారికిని స్వాంతముల న్గరిగింపఁజాలెడున్. 122

ఉ. కొమ్మలు పల్లవాధరలు కోమలపల్లవపాణులై తగన్
గమ్మనితావిఁజిమ్మ సుమగంధులు నొచు లతాంగులై యిలం
గొమ్మలు పల్లవాధరలు కోమలపల్లవపాణులై తగన్
గమ్మనితావిఁ జిమ్మ సుమగంధులునొచు లతాంగులై యిలన్॥

ఉ. మాధవుఁడుఁ రమాధవకుమారుఁడు మారుఁడుఁ జేసి చేరు తా
రాధవుతోడి సెయ్యము తిర మ్మల కొమ్మలపై వసించుచున్
సాధకులొచు భూజముల సాధువుల న్దయమాలి ప్రోథపు
న్బాధల స్రుక్కఁజేయుదురు పంచశరమ్ముల నెమ్మ వెట్టుచున్॥

ఉ. సౌరు నిసర్గమై యిటు లెసంగిన నింపవుఁ గాని, లేని శృం
గారముఁ దెచ్చునే? మెరుపుగా బటు వెత్తిన, నెత్తు, నెత్తు బం
గారమొ, మెర్గుఁ జాలది నిగారమొ కూర్చిన యంతమాత్ర నిం
పారునె? కేకియందమెటు లందునె యెంచును గూటసృష్టులన్॥

ఉ. నాచిననాఁటినుండియుఁ గనం గలిగెంగద వేనవేల నే
యేచిగురాకుఁబోడులనొ! యెన్నఁడు నామది కింత వింతగాఁ
దోఁచెనొ! యెంతచూచినను దోహలమూఁ గన నింకనింక, వా
చాచతురత్వ మింతయును జాలదుగా సతిరూప మెన్నఁగాన్॥

చ. సుదతుల నేఁడిఁ జూడ ననసుందరగాత్రిలఁ గన్నతల్లి నిన్
వదినెను జూచినట్లుకద వర్తిలు నెమ్మది నేఁ డిదేమియో
ముద మెదఁ గోర్కులుం బొదల ముచ్చట లెచ్చఁగ ప్రుచ్చిలించెడుం
జెదరునె నామనం బొరులచేడియ తా నయియున్న నెన్నఁడేన్?

క. అడుగుదునా యభిరాముని? నడిగిన నీచానఁగూర్చి యరయుటిదేమం
చాడఁద నెటుల్తలపోయునొ! జడిసిన నిజ మెట్లు తెలఁజాలెదునంచున్॥

## కథానాయకాభివర్ణనము

మ. అనుకొంచుం జనునంతలోఁ దనను డాయంజూచి యా లేమ ము
స్వనియున్నట్టిది రూప మిట్టిదవునే? వేమన్న రానున్నవాఁ
డని, రాఁగా నభిరాము స్వాగతము తా నందం దిరంబయ్యెఁ, గా
మిని, నేకామిని కాముఁడీత డనునెమ్మిం గాంచదం చిట్లనున్॥

ఉ. కంతునిఁ బోలుసుందరుఁడు కాంచనసన్నిభదేహకాంతి న
త్యంత మనోహరోత్తమ జయంత వసంత నితాంతశోభఁ గ
ర్ణాంతవిశాలలోచన కనత్కరుణాకర దృక్ప్రసారముల్
సంతసమార మీఱ విలసన్నవయౌవన తేజ మీనఁగాన్॥ 138

క. కంబుగ్రీవం బెన్నం గంబును గంబువునవిల్పు కరణి నెసంగం
గంబులు భాసిలు బాహాంతు గంబువు తుండములనంగఁ గ్రాలుచు
నుండన్॥ 139

ఉ. వీనపునాముఖంబునకు మేల్మి ద్విరేఫము లబ్జకీర్తి భా
భాసము సాన్ద్రజాలకము ప్రిభ న్నయనాబ్జములుం గళాబ్జ మ
బ్జాసవనాగ్ర్యచారము కరాబ్జ పదాబ్జ సమోర్జితస్థితిన్
హా సుమబాణుఁడే యనఁగ హాసము లబ్జనిభాచ్ఛముల్గదా॥ 140

చ. ధగధగలాడు కాంచన సుధామయవిగ్రహ నైజతేజము
న్నగుమొగము న్విశాలనయనంబులుఁ గన్నవ కింపు నింపఁగా
నెఱభుజము ల్బలాతిశయ మెన్నఁగనొప్పు విశాలవక్షముల్
సొగసులుగుల్కు వైఖరులు చొక్కము లై తగు నిక్కనిక్కమా॥

ఉ. ఇందునిఁబోల్ప గౌతమమునీశ్వరపత్ని వరించు పాపుఁడై
చందురుఁడో తారఁగూడిన నిశాచరుఁడై కన శాపలోపముల్
సాంద్రతరప్రభాపటల చారుసురూప వినిర్జితాంగజుం
డిందునిఁబోలు సంపదనె యిందునో మోమున హాసచంద్రికన్॥

వ. ఇట్లాయునతి లోలోన వర్ణించుకొంచున్న యవసరంబున నాతండ
డాయనేగుడు నించుక మోము వంచి క్రీఁగంటం గనుంగొంచుం
దలంగం గాంచిన వేమయ్య యభిరామయ్య నుద్దేశించినవాఁడై. 143

'విశ్వ'దాభిధాన పూర్వోత్తరము

క. మామక్కఱఁ బరికించిన యామానిని యూరుఁ బేరు నెఱిఁగింపు
మనన్
వేమారెడ్డికి నను నభిరామయ తద్వృత్త మత్తఁడు శ్రద్ధవినంగాన్॥

క. పుట్టెను రెడ్డికొలంబున గిట్టం దలి, రోవెలందికిం దండ్రియుడర్
బట్టినిగాఁ బెంచెం జేపట్టంగాలే దెవండు, వసియించు నిటన్॥ 145

క. తొలి నే'యశోద' యనిరో! వెలయుం బిలువంగ నేఁడు 'విశ్వద'
నాఁగాఁ
గులవృత్తి నొల్ల దాటను గలుషమ్ములువాయ్యఁ బల్కు గణికల
కెల్లన్. 146

క. విద్దెల నేర్చినదాచున్నద్దులు పెద్దలకెచెప్పు షోడిమిఁ గనదై
తద్దయు నీసుం గొలిచెడినుద్ది గుణంబున గణింప నొప్ప దదెందున్॥

క. ఆపెంచిన పణ్యాంగన 'యేపురుషు వరింతువమ్మ యెఱిఁగింపు'మనం
జేపట్టును నొకరెడ్డిని నాపాలిటిదైవ మతఁడె నాఁగొల్తునను౼ నంచ
క. అన వినఁగా నాభాగ్యము తన కబ్బెనుఁగాత మంచు దానెంచంగా
మనమున నదె చింతించుచుఁ జనె ముక్కుఱుఁ జేతఁగొంచు సంజ
వడంగాన్॥ 149

## సాయంసంధ్యాకాలము

సీ. పగలెల్ల నేపాట్లొ పడి కాళ్లు లీడ్చికొం
చును గొంపలం జేరఁజను జనాళి
గ్రాస మేబీళ్లనో కాపలసిన దేరి
కొనుచుఁ గొట్టముల కేగు పశుపాళి
చెట్టులం బుట్టల నెట్టెట్టొ పొట్టలఁ
బోసికొ గూండ్లకై పో ద్విజాళి
యేడ నేడనొ నూక లేరి బారులఁదీర్చి
బాట లోయకుఁ బట్టు కీటకాళి॥
తే. సృష్టి నెల్లెడఁ బురుషు లా స్త్రీచయంబుఁ
జేరి గీముల సుకమందఁ గోరుచుంట
సహజ ధర్మముగాఁ దోఁప సాగె నాఁటి
చీఁకటి మనంబు నెట్లొ చీకాకుపఱప॥ 150
క. వ్యాయామశాల కేగకయాయెడ నేకాంతసీమ కాతఁడు నడచెన్
బాయక చీఁకట్లైతనకుఁ జేయూఁతగ వెంట నడచుస్నేహితు
లనఁగాన్ 151

## చంద్రోదయము

ఆ. ఆతఁ డే మొనర్చునో తొంగిచూచె నాఁ దారకాళి చదలఁ దారు
చుండ
నెక్కఁదూర్పుకొండ రిక్కలఱేఁడంత వేపవచ్చె నపుడు వేమనన॥
ఆ. అననుభూతపూర్వ మాస్థితి యదియేమొ భీకరుండుగాసుధాకరుండె
నిజకరాళిఁ బఱప నెత్తికెక్కన్నాగె నాతపం బదేమొయంచుఁ
దోఁప॥ 153

ఉ. ఎల్ల జగంబు నావలెనె యెంచెడినో! మఱి యట్లుగాక,యా
చల్లనిరా॰ నాపయినె సా మొనరింపఁగసాగె నేమొకో!
యుల్లమునందు నాయుకలియొప్పిద మొప్పుట ముప్పుఁ దెచ్చునే?
వెల్లుగ రేఁగి ఘృష్టులను వేఁచెదు, నాఁచెను మార్గ మేయదో!
ఉ. పోవుమనా సతి న్దరియఁ బోవఁగ నేవగకాండ్రు సూతురో!
తా వెఱా చేరఁబోయినకడంక కె విశ్వద యేవగించునో!
నే వెడఁ గ్రై తినన్న నదినె న్మది నెవ్విధి నొవ్వకుందునో!
యే వెఱఁగొన్న న న్నటకెయిూడ్చెడుఁగా మది యంచు నెంచుచున్
ఉ. పోమనె రిక్తహస్తములఁ? బూవుల నేవియొ తావులీను జ
వ్వాది ఘనుంగు న త్తరువు వావిరిగాఁ జవిఁగూర్చు భక్ష్యముల్
స్వాదు ఫలాదికంబులు వెస న్బసఁ గొల్పెడు రత్నహారముల్
మోదదము లుదూలచయము లకనకాంబరపాళిఁ జేర్చెదన్. 156
ఉ. ఏసతియైనఁ బ్రీతిఁగన నింపగు నాయది కానకెట్ట సం
తోసిలి యాదరంబుమెయి దోసిలియొగ్గుచు నాసనం బిడున్
గాసిల నేటికం చరిగి కైకొని యన్నిటి గంపకెత్తి వి
శ్వాసముమీఱ విశ్వదనివాసముఁ జేరెఁ నిచ్చ లీనఁగాఁ॥ 157

ఆశ్వాసాంతము

మ. శ్రితనయోపర దక్షిణాస్య కరుణాశేషప్రభావాత్త వి
శ్రుత దిగ్దేశ బుధేశవర్ణిత మహాశుప్రక్రియానిర్మిత
శ్రుతివేమాంచిత సత్ప్రబంధ విలస త్సోదార వాగ్వైఖరీ
నత విద్వత్కవి కాననాంతవిచర న్న్యంకుప్రభాభాసురా॥ 158
మాలిని. వినుతహరితగోత్రా ! వేంకటేశప్రపౌత్రా !
సునయవిబుధమిత్రా ! సుబ్బయాభిఖ్యపౌత్రా !
ఘనకవినుతిపాత్రా ! కామయాఖ్యాకపుత్రా !
మునిసదృశచరిత్రా ! ముక్తికాన్తాకళత్రా ! 159

గద్యము. ఇది శ్రీ శేషాద్రి దక్షిణామూర్తి శ్వరాక్షిణ కరుణాకటాక్ష వీక్షాపాత్ర నాదెళ్ల పురుషోత్తమ కవీంద్రపుత్త్ర మేధా దక్షిణామూర్తి శాస్త్రి నామధేయ విద్వద్విధేయ కర్తృక శ్రీ వేమయోగీయంబునందుఁ బ్రథమాశ్వాసము. 160

# శ్రీ వేమయోగియమ

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీదక్షిణాస్య కరుణా సాదిత కవితావిలాస శశ్వత్కీర్తీ !
నాదెళ్ల పూరుషోత్తమ భూదేవోత్తమవరేణ్యా ! పూజ్యస్ఫూర్తీ !

వ. అపై నా పొత్తుటాలితో నీ పల్లవుం డుల్లాసంబు వెల్లి విరియించిన తెఱం గెట్టిదనిన.



వేశ్యావాటిక

సీ. కావేరులప్రతోళి కాపులులకు బాళి
వగలమారి పిసాళి తొగలహాళి
మెలుమూడ విటపాళి యింపైననటకేళి
వాకిళ్ల మందాళి వలుల హేళి
కేలనుబ్రసవాళిఁ గీలింపఁ గంకేళి
సిగవాటులవిరాళి జిగులతాళి
వలపింప నారాళి కులభక్ష్యములు పోళి
యులుప లిం కేపాళియో నివాళి.

తే. కాఁగఁ గామంపు టావళి గాజరవళి
వీనువిందైన జావళి వినఁగనోలి
యువకపల్లవరింఛోళి యూర్పుమాలి
నెగడ సౌధామ మచటి గాణిక్యసీమ. 3

శా. ఆ సీమంతిత మైనవాటికను డాయంబోవ నేవారికే
నాసీమంతము లాప్రసన్న ముఖరమ్యత్వంబు లాతళ్కు బె
ళ్కాసీమంతిను లూనుతావులును దామై స్వాగతంబీయఁగా
'నాసీమాంతము' చల్లఁగానొడిసి సన్యాసంబుఁ జేకూర్పరే ? 4

